



# క్షీరాబ్ధిశయన వ్రతకల్పము

ఆషాఢ శుద్ధ ఏకాదశి నాడు శ్రీ మహావిష్ణువు యోగనిద్రలో ప్రవేశించి, నాలుగు నెలల కాలం యందుండి తిరిగి కార్తీక శుద్ధ ఏకాదశి నాడు యోగనిద్రనుండి లేస్తాడు. మరునాడు అనగా కార్తీక శుద్ధ ద్వాదశి నాడు లక్ష్మీదేవి మరియు బ్రహ్మాది దేవతలతో కూడి తులసీ బృందావనమందు ప్రవేశిస్తాడు.చాతుర్మాస్యముగా పిలువబడే ఈ నాలుగు నెలల కాలం విష్ణుమూర్తిని పరమ భక్తితో సేవించి, కార్తీక శుద్ధ ద్వాదశి నాడు ఎవరైతే తులసీ బృందావనమందు వేష్టితుడై ఉన్న విష్ణుమూర్తిని సేవిస్తారో, వారి సకల పాపాలూ నశిస్తాయి. అంతే కాదు, క్షీర సముద్రము నుండి లక్ష్మీ దేవి ఉద్భవించిన తరువాత విష్ణుమూర్తి ఆమెను పరిణయమాడిన దినం. దీనిసే హరిబోధినీ ద్వాదశీ, చిలుక ద్వాదశి అని కూడా అంటారు. ఈనాడు లక్ష్మీ సమేతుడైన విష్ణుమూర్తిని తులసి, ధాత్రి(ఉసిరిక) వనమందు పూజించాలి. వనములకు వెళ్ళలేని పక్షంలో ఇంటివద్ద తులసి, ఉసిరి చెట్టు ఉన్న ప్రదేశంలో లక్ష్మీనారాయణుల ప్రతిమనుంచి పూజించాలి. (ఈనాటి పరిస్థితులను బట్టి ఉసిరి కొమ్మైనా ఉపయోగించవచ్చు). ఈనాడు దీపారాధనకు, దీప దానానికి అధిక ప్రాధాన్యత ఉంది. ఉసిరి కాయలను ప్రమిదలుగా చేసి, ఆవునేతి(ఆవు నెయ్యి శ్రేష్టము.దొరకనిచో నువ్వుల నూనె గానీ, మరే ఇతరమైన నూనె గానీ వాడవచ్చును.) తో తడిపిన వత్తి ఉంచి వెలిగించాలి. శక్తి కొలదీ ఎన్నైనా వెలిగించవచ్చును. సూర్యాస్తమయ సమయమందు ఈ పూజ చేసుకుంటారు. శ్రీ మహావిష్ణువును షోడశోపచారాలతో పూజించి, శక్తి కొలదీ నైవేద్యము సమర్పించి, వ్రత కథను చదువుకుని (విని) ఉసిరి దీపమును బియ్యము, వస్త్రము, దక్షిణ తాంబూలాదులతో బ్రాహ్మణునకు దానమిచ్చిన మంచిది. శక్తి కొలదీ వెండి ప్రమిద, బంగారపు వత్తి కూడా ఇవ్వవచ్చును. సాలగ్రామ దానం కూడా ఈ రోజున చేసిన మంచిది.

దీపం ప్రజ్వాల్య : (దీపమును వెలిగించి, కుంకుమ, అక్షతలు, పువ్వులతో ఆరాధన చేయవలెను.)

**ఆచమ్య:**

ఓం కేశవాయస్వాహా,ఓం నారాయణాయస్వాహా, ఓం మాధవాయస్వాహా,





గోవింద, విష్ణు,మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ అధోక్షజ, నారసింహ, అచ్యుత, జనార్ధన, ఉపేంద్రా, హరే: శ్రీకృష్ణాయ నమః, శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

ఉత్తిష్టంతు భూతపిశాచా: ఏతే భూమి భారకాః ఏతేషామ విరోధేన బ్రహ్మకర్మ సమారభే! (అక్షతలు వాసన చూసి నాలుగు వైపులా చల్లవలెను)

ప్రాణాయామ్య: ఓం భూ: ఓం భువ: ఓం సువ: ఓం మహ : ఓం జన: ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరే ణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోన: ప్రచోదయాత్!! ఓం ఆపో జ్యోతి రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం!(గాలిని పీల్చి విడువవలెను)

సంకల్పం

మమోపాత్త దురితక్షయ ద్వారా, శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం , శుభాభ్యాం శుభేశోభనే ముహూర్తే అద్యబ్రహ్మణ: శ్రీ మహా విష్ణోరాజ్ఞేయా ద్వితీయపరార్థే , శ్వేతవరాహకల్పే , వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమపాదే, జంబుద్వీపే, భరత వర్షే భరతఖండే, మేరో: దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే (మీ నివాస ప్రాంతం శ్రీశైలానికి ఏ దిక్కున ఉన్నదో ఆ దిక్కు చెప్పుకోవలెను) ,గంగా గోదావర్యోర్మధ్య దేశే మమ స్వ (వసతి)గృహే సమస్త దేవతా గో బ్రాహ్మణ గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ......సంవత్సరే దక్షిణాయనే, .శరదృతౌ, కార్తీక మాసే, శుక్ల పక్షే, ద్వాదశ్యాం శుభనక్షత్రే – శుభయోగే –శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ, శ్రీమాన్ ..... గోత్ర:.......... నామధేయ: శ్రీమత:......... గోత్రస్య ......... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమకుటుంబస్య సభ్రాతృకస్య సబాంధవస్య క్షేమస్థయిర్య ధైర్య విజయ అభయ ఆయురారోగ్యఐశ్వర్యాభివృధ్యర్థం, మమధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ద్యర్థం సకలమనోభీష్ఠ సిద్ద్యర్థం శ్రీమత్ క్షీరాశయన దేవతాముద్దిశ్య శ్రీ క్షీరాబ్ధిశయన దేవతాప్రీత్యర్థం కల్పోక్త ప్రకారేణ, యావచ్ఛక్తి, ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే:

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే !! (ఇక్కడ కలశ పూజ తరువాత మహాగణపతి (పసుపు గణపతి) పూజ క్లుప్తంగా ఆచరించవలెను).





తదంగ కలశపూజాం కరిష్యే।

<u>కలశపూజ:</u> కలశస్యముఖే విష్ణు: కంఠే రుద్రస్సమాశ్రిత: మూలేతత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాః స్మృతాః కుక్షౌతుసాగరా స్సర్వే స్సప్తద్వీపా వసుంధరా, ఋగ్వేదోధయజుర్వేదస్సామవేదోహ్యధర్వణ: అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః

ఓం ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే ఉక్ ధైర్యజ్ఞేషు వర్ధతే, ఆపోవాయిదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవః ఆపో న్నమాపోఽమృతమాప స్సమ్రాడాపో విరాడాప, స్వరాడాపా ఛందాగుంష్యాపో జ్యోతీ గ్ంష్యాపో యజూగుంష్య ప స్సత్యమాప న్సర్వేదేవతా: ఆపోభూర్భువస్సువరాప ఓం ॥

గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి, నర్మదా సింధు కావేరి జలస్మిన్ సన్నిధింకురు॥

ఆయాంతు దేవపూజార్థం దురితక్షయ కారకా॥ కలశోదకేన పూజాద్రవ్యాణి దేవమాత్మానంచ సంప్రోక్ష్య॥

(ఇక్కడ పసుపు గణపతి పూజ చేయవలయును. అనంతరం ...)

ప్రాణ ప్రతిష్ఠాపనం కరిష్యే॥

<u>ప్రాణాప్రతిష్ఠా:</u>

అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణామినో దేహి భోగం జోక్పశ్యేమః సూర్యముచ్చరంత మనుమతే మృడయాన స్వస్తి అమృతంపై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యధాస్థాన ముపాహ్వయతే। ఉపాహితో భవ, స్థాపితో భవ, సుప్రసన్నోభవ, అవకుంఠితోభవ, ప్రసీద ప్రసీద ప్రీతం యత్కించిత్ నివేదితం మయా॥

తదంగ ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥

అథ ధ్యానం.

శ్లో | దక్షిణాగ్రకరే శంఖం పద్మం తస్యాన్యధః కరేః

చక్రమూర్ధ్వ కరే వామం, గదా తస్యా న్య ధః కరే

దధానం సర్వ లోకేశం సర్వాభరణ భూషితం

క్షీరాబ్ధి శయన దేవ ధ్యాయే న్నారాయణం ప్రభుం||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః, ధ్యాయామి ధ్యానం సమర్పయామి.





ఆవాహనం:-

శ్లో| సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్

సభూమిం విశ్వతో వృత్వా అత్యాతిష్ఠ ద్దశాంగులం ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః ఆవాహయామి, ఆవాహనం సమర్పయామి.

రత్న సింహాసనం:-

శ్లో| అనేక హార సంయుక్తం నానామణి విరాజితం

రత్నసింహాసనందేవ ప్రీత్యర్థం ప్రతి గృహ్యతాం ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః రత్నసింహాసనం సమర్పయామి.

పాద్యం :-

శ్లో| పద్మనాభ సురారాధ్య పాదాంబుజ శుభప్రద

పాద్యం గృహాణ భగవాన్ మయానీతం శుభావహం ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః పాదయోః పాద్యం సమర్పయామి.

అర్ఘ్యం:-

శ్లో| నిష్కళంక గుణారాధ్య జగత్రయ రక్షక

అర్ఘ్యం గృహాణమద్దత్తం శుద్ధోదక వినిర్మితం ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

ఆచమనీయం:-

శ్లో| సర్వారాధ్య నమస్తేస్తు సంసారార్ణవ తారక

గృహాణ దేవ మద్దత్తం పరమాచమనీయకం ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.

పంచామృత స్నానం :-

శ్లో| స్వపాద పద్మ సంభూత గంగాశోభిత విష్ణునం





పంచామృతైః స్నాపయిష్యేతం శుద్ధోదకేనాపిచ ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః పంచామృత స్నానం సమర్పయామి.

శుద్ధోదక స్నానం:-

శ్లో| ఆపోహిష్ఠామయో భువః తాన ఊర్జే దధాతన| మహేరణాయ చక్షసే | యోవశ్శివ తమోరసః తస్యభాజయతే హనః |ఉశతీరివ మాతరః | తస్మా అరంగ మామవః | యస్య క్షయాయ జిన్వధ | ఆపోజనయధాచన ||

తులసీ దాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః శుద్ధోదకస్నానం సమర్పయామి.

వస్త్రయుగ్మం :-

శ్లో| విద్యుద్విలాసరమ్యేణ స్వర్ణ వస్త్రేణ సంయుతం,

వస్త్ర యుగ్మం గృహాణేదం భక్త్యాదత్తం మయాప్రభో ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః వస్త్రయుగ్మం సమర్పయామి.

యజ్ఞోపవీతం:-

శ్లో| నారాయణ నమస్తేస్తు నాకాధిపతి పూజిత,

స్వర్ణోపవీతం మద్దత్తం స్వర్ణంచ ప్రతి గృహ్యాతాం ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

గంధం:-

శ్లో| రమాలింగన సంలిప్త రమ్య కాశ్మీర వక్షసే

కస్తూరీ మిళితం దాస్యే గంధం ముక్తి ప్రదాయకం ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః దివ్య శ్రీ చందనం సమర్పయామి.

అక్షతలు:-

శ్లో |అక్షతాన్ నక్షతాన్ శుభ్రాన్ పక్షిరాజధ్వ జావ్యయ,

గృహాణ స్వర్ణ వర్ణాంశ కృపయా భక్త వత్సల ||

తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః అక్షతాన్ సమర్పయామి.





పుష్పములు :-

శ్లో |చామంతికా వకుళచంపక పాటలాబ్జ పున్నాగ  జాజికరవీరరసాల పుష్పై

బిల్వ  ప్రవాళ తులసీదళ మల్లికాభిస్త్వాం పూజయామి జగదీశ్వర, వాసుదేవః

తులసీ  ధాత్రీ సమేత శ్రీలక్ష్మీ నారాయణ స్వామినే నమః  పుష్పాణి పూజయామి

అథాంగ పూజా

సాధానంత కేశాయ నమః పాదౌపూజయామి||

నివృత్తినిమేషాది కాలాత్మనే నమః  జంఘే పూజయామి||

విశ్వరూపాయ నమః  జానునీపూజయామి||

జగన్నాధాయ నమః  గుహ్యం పూజయామి||

పద్మనాభాయ నమః  నాభిం పూజయామి||

కుక్షి స్థాఖిలవిష్టపాయ నమః  కుక్షిం పూజయామి||

లక్ష్మివిలసద్వక్షసే నమః  వక్షం పూజయామి||

చక్రాదిహస్తాయ నమః  హస్తౌ  పూజయామి||

కంబుకంఠాయ నమః  కంఠం  పూజయామి||

చంద్రముఖాయ నమః  ముఖం పూజయామి||

వాచస్పతయే నమః  వక్త్రం పూజయామి||

కేశవాయ నమః  నాసికాం పూజయామి||

నారాయణాయ నమః  నేత్రౌ పూజయామి||

గోవిందాయ నమః శ్రోత్రౌ పూజయామి||

నిగమశిరోగమ్యాయ  నమః  శిరః పూజయామి||

సర్వేశ్వరాయ నమః  సర్వాణ్యంగాని  పూజయామి||







## అధ శ్రీ విష్ణ్వష్టాత్తర శతనమార్చనం కుర్యాత్

## విష్ణ్వష్టోత్తర శతనామావళి

| | | |
|---|---|---|
| ఓం విష్ణవే నమః | ఓం పురుషాయ నమః | ఓం నిరామయాయ నమః |
| ఓం జిష్ణవే నమః | ఓం సహస్రాక్షాయ నమః | ఓం శుద్ధాయ నమః |
| ఓం వషట్కారాయ నమః | ఓం సహస్రపాదవే నమః | ఓం నరదేవాయ నమః |
| ఓం దేవదేవాయ నమః | ఓం సర్వగాయ నమః 40 | ఓం జగత్ప్రభవే నమః |
| ఓం వృషాకపయే నమః | ఓం సర్వవిదే నమః | ఓం హయగ్రీవాయ నమః |
| ఓం దామోదరాయ నమః | ఓం సర్వాయ నమః | ఓం జితరిపవే నమః |
| ఓం దీనబన్ధవే నమః | ఓం శరణ్యాయ నమః | ఓం ఉపేన్ద్రాయ నమః |
| ఓం ఆదిదేవాయ నమః | ఓం సాధువల్లభాయ నమః | ఓం రుక్మిణీపతయే నమః 80 |
| ఓం దితేస్తుతాయ నమః | ఓం కౌసల్యానందనాయ నమః | ఓం సర్వదేవమయాయ నమః |
| ఓం పుండరీకాయ నమః 10 | ఓం శ్రీమతే నమః | ఓం శ్రీశాయ నమః |
| ఓం పరానందాయ నమః | ఓం రక్షఃకులవినాశకాయ నమః | ఓం సర్వాధారాయ నమః |
| ఓం పరమాత్మనే నమః | ఓం జగత్కర్తాయ నమః | ఓం సనాతనాయ నమః |
| ఓం పరాత్పరాయ నమః | ఓం జగద్ధర్తాయ నమః | ఓం సౌమ్యాయ నమః |
| ఓం పరశుధారిణే నమః | ఓం జగజ్జేతాయ నమః 50 | ఓం సౌమ్యప్రదాయ నమః |
| ఓం విశ్వాత్మనే నమః | ఓం జనార్తిహరాయ నమః | ఓం స్రష్టాయ నమః |
| ఓం కృష్ణాయ నమః | ఓం జానకీ వల్లభాయ నమః | ఓం విష్వక్సేనాయ నమః |
| ఓం కలిమలాపహారిణే నమః | ఓం దేవాయ నమః | ఓం జనార్ధనాయ నమః |
| ఓం కౌస్తుభోద్భాసితోరస్కాయ నమః | ఓం జయరూపాయ నమః | ఓం యశోదతనయాయ నమః 90 |
| ఓం నరాయ నమః | ఓం జలేశ్వరాయ నమః | ఓం యోగాయ నమః |
| ఓం నారాయణాయ నమః 20 | ఓం క్షీరాబ్ది వాసినే నమః | ఓం యోగశాస్త్ర పరాయణాయ నమః |
| ఓం హరిఃయే నమః | ఓం క్షీరాబ్ధితనయా వల్లభాయ నమః | ఓం రుద్రాత్మకాయ నమః |
| ఓం హరాయనమః | ఓం శేషశాయినే నమః | ఓం రుద్రమూర్తయే నమః |








| | | |
|---|---|---|
| ఓం హరప్రియాయ నమః | ఓం పన్నగారీవాహనాయ నమః | ఓం రాఘువాయ నమః |
| ఓం స్వామినే నమః | ఓం విష్ఠరశ్రవాయ నమః 60 | ఓం మధుసూదనాయ నమః |
| ఓం వైకుంఠాయ నమః | ఓం మాధవాయ నమః | ఓం అతుల తేజసే నమః |
| ఓం విశ్వతో ముఖాయ నమః | ఓం మధురానాథాయ నమః | ఓం దివ్యాయ నమః |
| ఓం హృషీకేశాయ నమః | ఓం ముకుందాయ నమః | ఓం సర్వపాపహరాయ నమః |
| ఓం అప్రమేయాయ నమః | ఓం మోహనాశనాయ నమః | ఓం పుణ్యాయ నమః 100 |
| ఓం ఆత్మనే నమః | ఓం దైత్యారిణే నమః | ఓం అమిత తేజసే నమః |
| ఓం వరాహాయ నమః 30 | ఓం పుండరీకాక్షాయ నమః | ఓం దుఃఖనాశనాయ నమః |
| ఓం ధరణీ ధరాయ నమః | ఓం అచ్యుతాయై నమః | ఓం దారిద్ర్యనాశనాయ నమః |
| ఓం ధర్మేశాయ నమః | ఓం మధుసూదనాయ నమః | ఓం దౌర్భాగ్యనాశనాయ నమః |
| ఓం ధరణీ నాథాయ నమః | ఓం సోమసూర్యాగ్ని నయనాయ నమః | ఓం సుఖవర్ధనాయ నమః |
| ఓం ధ్యేయాయ నమః | ఓం నృసింహాయ నమః 70 | ఓం సర్వసంపత్కరాయ నమః |
| ఓం ధర్మభృతాంవరాయ నమః | ఓం భక్తవత్సలాయ నమః | ఓం సౌమ్యాయ నమః |
| ఓం సహస్రశీర్షాయ నమః | ఓం నిత్యాయ నమః | ఓం మహాపాతకనాశనాయ నమః 108 |

ఇతి శ్రీ విష్ణ్వష్టోత్తర శతనామావళిః

ధూపము :-

శ్లో | దశాంగం గుగ్గులోపేతం చందనాగరు వాసితం

ధూపం గృహాణ దేవేశ దూర్జటీ నుత సద్గుణా ||

తులసీ ధాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః ధూపమాఘ్రాపయామి

దీపము :-

శ్లో| అజ్ఞాన ధ్వాంత నాశాయ అఖండ లోకశాలినే

ఘృతార్తివర్తి సంయుక్తం దీపం దద్యామి శక్తితII

తులసీ ధాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః సాక్షాత్ దీపం దర్శయామిII

ధూపదీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామిII







నైవేద్యము :-

శ్లో | పృధుకానిక్షు ఖండాంశ్చ కదళీ ఫల కానిచ,

దాపయిష్యేచ  భవత్ప్రీత్యై  గృహాణ సురపూజితII

అమృత మస్తు అమృతో పస్తరణ మసి,

తులసీ ధాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః  నైవేద్యం సమర్పయామి

ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా , ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి అమృతా పిధానమసి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి శుద్ధాచమనీయం సమర్పయామి.

తాంబూలము :-

శ్లో| విస్తీర్ణ సుసంయుక్తం నాగవల్లీ విరాజితం

కర్పూరేణ సుసమ్మిశ్రం తాంబూలం స్వీకురు ప్రభో ||

తులసీ ధాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః  తాంబూలం  సమర్పయామిII

నీరాజనం :-

శ్లో| ప్రదీపితంచ కర్పూర ఖండకైః   జ్ఞాన దాయినం

గృహాణేదం మయాదత్తం నీరాజనమిదం ప్రభో II

తులసీ ధాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః  నీరాజనం దర్శయామిII

నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామిII

మంత్రపుష్పం :-

పుష్పాంజలీం  ప్రదాస్యామి భక్త్యాభక్తాశ్రయ ప్రభో

అనుగ్రహంతుభద్రం మే దేహి దేవేశ్వరార్చిత II

తులసీ ధాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః  సువర్ణ మంత్రపుష్పం  సమర్పయామిII





ప్రదక్షిణం :-

శ్లో| ప్రదక్షిణం కరిష్యామి సర్వభ్రమనివారణం

సంసార సాగరాన్మాం త్వ ముద్ధరస్య మహాప్రభో||

తులసీ ధాత్రీ సమేత శ్రీ లక్ష్మీ నారాయణ స్వామినే నమః ప్రదక్షిణ సమస్కారాన్ సమర్పయామి||

ధారాదత్తం:-

యస్య స్మృత్యాచ నమోక్త్యా తప: పూజాక్రియాదిషు

న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందేతమచ్యుతం||

ఏతత్ఫలం తులసీ ధాత్రీ సమేత శ్రీలక్ష్మి నారాయణార్పణమస్తు.

కథా సంగ్రహము

శ్లో | క్షీరాంబోధితరం గోత్థబిందు చంద్రాంకి తాకృతిం

తులసీ వనమాలాయా మాన్గికం మాధవం భజే ||

బ్రహ్మోవాచ

శ్లో| క్షీరాబ్ధి శయనా ద్విష్ణు రుత్థాయ ద్వాదశీ దినే

బృందావనం సమాయాతి లక్ష్మీ బ్రహ్మాదిభిస్సహ ||

తా|| బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు _ ఎల్లప్పుడూ క్షీరసముద్రములో శయనించియుండు విష్ణువు (కార్తీక) ద్వాదశి రోజున లక్ష్మీ, బ్రహ్మ మొదలగువారితో గూడి బృందావనమునకు వచ్చును.

శ్లో| తత్ర బృందావనే పూజాం కుర్యా ద్బుద్ధి మాన్నరః

ఆయురారోగ్య మైశ్వర్యం ప్రాప్నుయా న్నాత్ర సంశయః ||





తా|| అప్పుడట్టి బృందావనమందు యెవరు శ్రద్ధాభక్తులతో విష్ణుపూజ చేయుదురో వారికి దీర్ఘాయువు, ఆరోగ్యము, ఐశ్వర్యము మొదలగునవి కలుగుననుటకు సంశయము లేదు.

శ్లో| కార్తీక్యాం శుక్లపక్షేచ ద్వాదశ్యా మస్తమేరవౌ
తస్మిన్ కాలే మహాపుణ్యం స్నానం దానం చ పూజనం ||
తా|| కార్తీక శుద్ధ ద్వాదశిరోజున, సుర్యుడస్తమించిన తరువాత స్నానము గాని, దానము గాని, పూజగాని చేసినట్లయినచో అది అధికమైన ఫలము నిచ్చును.

శ్లో| క్షీరాబ్ది శయనాద్దేవో లక్ష్మ్యా సహ సమాగతాః
యత్రబృందావనే క్షేత్రే నివస న్మునిభి స్సహః
తత్ర బృందావనే పూజాం నారాయణ మనామయం
తులసీం పూజయే ద్భక్త్యా బ్రహ్మాద్యై స్సర్వ దేవతైః

తా|| క్షీరసముద్రము నుండి లక్ష్మీదేవితో గూడి, సమస్తమునుల చేతను నమస్కృతుడై, పరమేశ్వరుడయిన నారాయణుడెచ్చట వాసముచేయునో యట్టి బృందావన క్షేత్రమందు పూజనీయుడైనట్టియు, నిత్యుడయినటు వంటియు, తులసీ సహితుడైనట్టియు శ్రీమన్నారాయణమూర్తిని బ్రహ్మాది సమస్త దేవతలను శ్రద్ధాభక్తి యుక్తులయి పూజ చేయవలెను.

శ్లో| వశిష్టాది మునిస్తోమైః పూజితో తులసీ వనే
తదా ప్రభృతీయ ద్విష్ణు ప్రతిజ్ఞో కృతవాన్ ప్రభుః
కస్మిన్ దినే తులస్యాంతు యః పూజాం కురుతే నరః





సర్వపాపా వినిర్ముక్తః మమసాయుజ్య మాప్నుయాత్ ||

తా|| శ్రీ మహావిష్ణువు వశిష్టాది మహామునులచేత నానావిధ మంత్రపూర్వకముగా తులసీ వనమందు పూజింపబడినవాడైన యా కాలమునందు, యీ కార్తీక శుద్ధ ద్వాదశినాడు తులసీవన మందు నన్ను యెవరు పూజచేయుదురో వారు సమస్త పాపముల చేతను విడువబడి నా సాన్నిధ్యమును పొందుదురని ప్రతిజ్ఞ చేసెనట.

శ్లో| దేవో వా ప్యథవా యక్షో నారదాది మునీశ్వరా

బృందావనే స్థితం విష్ణు మర్చయంత్యఘనాశనం ||

తా|| దేవతలేమి, యక్షులేమి, నారదుడు మొదలగు మునీశ్వరులేమి వీరందరునూ బృందావనములో సన్నిహితుడైయున్న శ్రీవిష్ణువును,సమస్త పాపములు నశించుటకు గాను పూజ చేయుచున్నారు.

శ్లో| పతితో వా ధవా శూద్రో ద్వాదశ్యాం విష్ణు మర్చయేత్

మహాపాతక యుక్తోనా వ్యుపపాతక సంయుతః

తస్య పాపాని నశ్యంతి తులారాశిరి వానలాత్||

తా|| పతితుడుగాని, శూద్రుడైనవాడుగాని, మహాపాతకముల చేసినవాడు గాని, ఉపపాతకయుతుడుగాని ద్వాదశి రోజున విష్ణువును పూజించినట్లయిన వాని పాపములన్నియు అగ్నిహోత్రములో పడిన ప్రత్తిపోగువలె నశించిపోవును.

శ్లో | నకుర్యాద్యః పుమాన్ పూజా తులసీ సహితం హరిః

పూర్వ పుణ్యం త్యజే యేత రౌరవం నరకం వ్రజేత్ ||

తా|| తులసీసహితుడయిన శ్రీ విష్ణువును యే పురుషుడు పూజ చేయకవుండునో అట్టి పురుషుడు పూర్వ పుణ్యములనుండి విడువబడినటువంటి వాడై రౌరవంబను నరకమును బొందును.





శ్లో| స్త్రీ శూద్రైః ప్రాప్యతే స్వర్గం కింపునః బ్రాహ్మణాదిభిః

తా|| బృందావనమందు సన్నిహితుడైయున్న శ్రీవిష్ణువును పూజించినచో స్త్రీలు, శూద్రులు కూడా స్వర్గమును పొందుదురు. కావున బ్రహ్మణాదులు పూజచేసినచో పోందెడి ఫలము యిట్టిదనీ చెప్పవలసిన పనిలేదు.

శ్లో| బృందావనస్య మహాత్మ్యం విష్ణోశ్చ ప్రీతి కారణాత్

దేవగంధర్వః ఋషయ పూర్వం విష్ణుం పూజయాత్ ||

తా|| బృందావనము చాలా మహాత్మ్యము గలిగినదని, అచ్చోట పూజించినట్లయితే విష్ణువునకత్యంత సంతోషకరమని, పూర్వము దేవతలు, గంధర్వులు, ఋషులు మొదలగు వారందరూ బృందావనమందు సన్నిహితుడైయున్న శ్రీవిష్ణువును పూజించిరి.

శ్లో| నార్చయేత్తులసీదేవీం కార్తీక ద్వాదశీ దినే

జాయతే పాపరూపేణ ఛండాలః కోటి జన్మసు ||

తా|| కార్తీక శుద్ధ ద్వాదశినాడు తులసీ సహితుడైన నారాయణమూర్తిని పూజించని మనుజులు కోటి జన్మములు పాపులుగా, ఛండాలురుగా పుట్టుదురు.

శ్లో| త మేన పూజయే ద్ధీమాన్ తస్మిన్ బృందావనే హరిం

బ్రహ్మహత్యా సురాపాన సువర్ణస్తేయ సంభవాః

గురుతల్పక సంయుక్తా ఉపపాతక కోటిభిః

తత్సర్వం క్షణ మాత్రేణ ముచ్యతే తూలీరాశివత్ ||

తా|| కార్తీక శుద్ధ ద్వాదశి రోజున నీ బృందావనమందు శ్రీ మహావిష్ణువును అనన్య శరణ్యులై శ్రద్ధాభక్తులతో పూజ చేసినటులయితే బ్రహ్మహత్య, సురాపానము, సువర్ణ స్తేయము మొదలగు మహాపాతకములుగాని,





గురుతల్పగమనము మొదలగు అతిపాతకములుగాని, ఉవ పాతకకోటులయిననూ గాని, యవన్నియూ తక్షణమే యగ్నిహోత్రమునందు పడిన దూదివలె దగ్ధమగును.

శ్లో| తత్కుర్యాత్పూజనం విష్ణోః తులసీ బృందావన సన్నిధౌ ||

తా|| అట్టి మహాపుణ్యప్రదమగునట్టిది గాన, తులసీబృందావన సన్నిధానము నందు శ్రీ మహావిష్ణువును పూజించుట ప్రశస్తమైయున్నది.

శ్లో| కల్పోక్త విధినా సమ్యక్పూజయే చ్ఛ్రద్ధ మానసాః
వేదోక్త మంత్ర యుక్తేన పురుషసూక్తేన వా పునః
పంచామృత స్నానం పూర్వం తతః శుద్ధోదకేన చ
అభిషించ్యతతో దేవం స్వర్ణ వస్త్రేణ సంయుతం
పుష్పై నానావిధై ర్దివ్యై ర్ధూపదీపై స్సమర్చయేత్
నైవేద్యం చ తడామస్యగ్దత్యా సద్భక్తి పూర్వకం
పూజా మేవంతు యః కుర్యా త్సర్వపాపైః ప్రముచ్యతే ||

తా||సాధుడగు పురుషుడు స్నాన సంధ్యావందనాది నిత్య కర్మానుష్ఠానంబులు సలిపి, కల్పోక్త ప్రకారముగ నానావిధ వేదమంత్రములచేత గాని,పురుషసూక్తము చేతగాని, శ్రద్ధాభక్తియుక్తుండై పూజ చేయవలయును. ఏలాగునంటే మొదట పంచామృతస్నానము గావించి, ఆ పిమ్మట శుద్ధోదకములచే అభిషేకమొనర్చి, ఆ మహావిష్ణువును స్వర్ణ వస్త్రములచేనలంకరించి, నానావిధములగు పుష్పములచేతను, ధూపదీపాదులచే పూజించి, భక్తిపురస్సరముగా నైవేద్యమునిచ్చి దక్షిణతాంబూలములు సమర్పించి, ఆ పిదప కర్పూర నీరాజనము సమర్పించవలయును. లోకమునందెవ్వడీ ప్రకారము పూజలు గావించుచుండునో నాతడు సకల పాపములచే విడువబడి సమస్త సంపత్సమృద్ధులు కలిగి మిగుల జయశాలియై యుండును.





శ్లో| తత్ర సమ్మార్జనం కృత్వా గోమయే నోపలిప్యచ

పంచవర్ణాని చూర్ణాని నీల పీత్య సితైరపి

స్వర్ణ గౌరాది వర్ణేన చాలంకారంతు కారయేత్ ||

పద్మ శంఖ మహాశార్ ఙ్గ చక్రం కౌమోదకీం తథా

గోపాద న్వత్స సాదాంశ్చ అర్చయే ద్వేదికోపరి

తా|| అచ్చోటనూడ్చి, గోమయముచేత నలికి, పంచవన్నె ముగ్గులతోనలంకరించి, పద్మములను, శంఖమును, శార్ ఙ్గమును, చక్రమును, కౌమోదకిని, గోపాదమును, వత్సపాదములను ఆ తిన్నెమీద నలంకరించి పూజించి తరువాత గీతవాద్యములతోను, వేదఘోషలతోనూ తులసీ కధను వినవలయును.

శ్లో| పూజాం తేపి చ సంతుష్టం స్వస్థచిత్తో భవేన్నరః

తా|| పూజ చేసిన తరువాత సంతుష్టుడుగానున్నూ, స్వచ్ఛమైన మనస్సు గలవాడుగాను కాగలడు.

శ్లో| తులసీ వ్రత మహాత్మ్యం శ్రోతవ్యం పుణ్య వాంఛితః

యదిచ్ఛే ద్విష్ణు సాయుజ్యం శ్రోతవ్యం బ్రాహ్మణైస్సహః

విష్ణోః ప్రీతిశ్చ కర్తవ్యా శ్రోతవ్యా తులసీకథా

ద్వాదశ్యాం శ్రవణాత్తస్యాః పునర్జన్మ నవిద్యతే ||

తా || పుణ్యము గోరెడువాడు యెలాగైనా తులసీవ్రత మహాత్మ్యము వినవలయును. విష్ణు సాన్నిధ్యము కావలయునన్నట్లయితే బ్రాహ్మణసభలో తులసీ మహాత్మ్యమును వినవలయును. విష్ణుదేవునికి యే మాత్రము ప్రీతి చేయవలెనని యున్ననూ తులసీ మహాత్మ్యమును భక్తితో వినవలయును. ద్వాదశి రోజున తులసీ కధను విన్నట్లయితే పూర్వజన్మకృతమైన దుఃఖములన్నియు వదిలిపోవును. ఎవరు దానిని వినెదరో, చదువుదురో వారు విష్ణులోకము పొందుదురు.





శ్లో| ధూపదీపంతు యః పశ్యే ద్గంగా స్నానఫలం లభేత్
నీరాజనాది కాలేషు యః పశ్యే త్పాప సంయుతః
తత్సర్వం నశ్యతే పాపం తులారాశి రి వానలే
ఏన నీరాజనజ్యోతి శ్చక్షుభి శ్చిరసి చార్చితం
తేనపుణ్యేన మనుజో విష్ణులోకం స గచ్ఛతి ||

తా || అప్పుడు పూజా కాలమునందు ధూపదీపములను చూచినవాడు గంగాస్నాన ఫలమును పొందును, పాపము గలవాడెవ్వడైననూ నీరాజనమును చూచినట్లయితే వాని పాపమంతయు నిప్పులలో పడిన ప్రత్తిపోగువలె మండిపోవును. ఎవడు నీరాజమును నేత్రములందును, శిరస్సునందును యద్దుకోనునో వానికి విష్ణులోకము కలుగును.

శ్లో| అనంతరంతు నైవేద్యం నారికేళ గుడాదికాన్
ఖర్జూర కదళీశ్చైవ ఇక్షుఖండాన్ సమర్పయేత్

తా || ఆ వెనుక టెంకాయలు, బెల్లము, ఖర్జూరము, అరటిపండ్లు, చెరుకుగడలు, మొదలగువానిని నివేదనము చేయవలెను.

శ్లో| ఏతాన్ సమర్ప్య నై వేద్యం తులస్యాః కేశవస్య చ
లబ్ధ్వా ప్రసాదం విష్ణోశ్చ మోక్షార్థీ బుద్ధిమాన్నరః
తత స్సమర్చయే ద్విప్రాన్ దక్షిణాం చ స్వశక్తితః
ఏవం విధా చ యః కుర్యా త్కో టి జన్మోఘ నాశనం
ఇహ గచ్ఛే త్సర్వ భోగా న్పరత్రచ పరాంగతిం ||

తా || వీటిని తులసి సన్నిహితుడైన శ్రీ మహావిష్ణువునకు నైవేద్యంగా సమర్పించి మోక్షార్థియైన పురుషుడు శ్రీపాద మంత్రాక్షతలను పుచ్చుకొని, శ్రద్ధాభక్తియుక్తుండై గంధ పుష్పాక్షతలతో బ్రాహ్మణులను పూజించి, యధాశక్తి





దక్షిణాదులనివ్వవలయును. ఈ ప్రకారము కోటి జన్మములయందు చేసిన పాపములను నశింపజేసెడి యీ మహావ్రతమును యెవరొనర్తురో వారికి ఈ లోకమునందు సమస్త భోగములును, ఆముష్మికమున ఉత్కృష్టమైన గతియును కలుగును.

శ్లో|| బృందావనే దీపదానం కుర్యాద్వై ద్వాదశీ దినే
ఏకేన దీపమాత్రేణ   ఉపపాతక నాశనం
దశ సంఖ్యా ప్రదీపైశ్చ మహాపాతక నాశనమ్
శత సంఖ్యాకదీపైశ్చ శివసాయుజ్యమాప్నుయాత్
అతః ఊర్ధ్వం దీపఫలం మయావక్తుం న శక్యతే
ఇంద్రాది దేవతాస్సర్వే కార్తీక్యాం దీపదానతః
త్రిదివేశా బభూవస్తాః దీపదానం చ కుర్వతీ
తథా బ్రహ్మాది దేవాశ్చ వైకుంఠే శాశ్వతై ర్వసన్
బృందావన సమీపేతు దీపదానం కరోతి యః
వైకుంఠే విపులాన్ భుక్త్వా విష్ణుసాయుజ్య మాప్నుయాత్
ప్రజ్ఞా యాయుర్బలం ధైర్యం సంపదాశ్చ వివర్ధనం
జాతస్మరత్వం మోక్షశ్చ దీపదర్శన మాత్రతః ||

తా|| ఈ ద్వాదశి రోజు బృందావన సన్నిధి యందు అవశ్యముగా దీపదానము చేయవలెను. ఏకదీపదానము చేసినయెడల ఉపపాతకములు నశించును. పది దీపముల దానముచే మహాపాతక నాశనమగును. నూరు దీపములు దానము చేసినవారికి శివసాన్నిధ్యము కలుగును. ఇంతకుమీదట దీపదానము చేయుటవల్ల స్వర్గాధిపత్యమును పొందుదురు. అలాగే బ్రహ్మాదులకు దీపదాన ప్రభావం వలననే వైకుంఠమందు శాశ్వతమైన నివాసము కలిగియుందురు. శుద్ధ ద్వాదశీ రోజు బృందావన సన్నిధియందు దీపదానము యెవడు చేయునో యాతడు వైకుంఠములో సమస్తమైన భోగముల ననుభవించి విష్ణు సాన్నిధ్యమును పొందును. ఆ దీపదర్శన





మాత్రముచేతనే ఆయుర్దాయము, బుద్ధిబలము, ధైర్యము, సంపత్తులు, పూర్వజన్మ స్మరణ, మొదలైనవన్నియు కలుగును.

శ్లో| ఉత్తమం గోఘృ తం ప్రోక్తం మధ్యమం తిలతైలకం
అథమం మథుతైలంస్యా దధమాధమం వన సంభవం
గోఘృతాన్ జ్ఞాన సిద్ధిశ్చ మోక్ష ప్రాప్తిస్తతః పరం
సంపద్వృ ద్ధిర్యశో వృద్ధి స్తిల తైలం దదాతిచేత్
వన్యాదికంతు కామ్యార్థం తత స్సర్ష పతైలకం
అగస్త్య సంభవం తైలం శత్రునాశన కారణం
ఏరండ తైల దీపేన సంపదాయుశ్చ నశ్యతి
ఘృతం మాహిషికం స్యాచ్చే త్పూర్వపుణ్యం వినశ్యతి
యత్కించి ద్గోఘృతోపేతే కశ్చి ద్దోషోన విద్యతే
దీపదానస్య మహాత్మ్యం న వక్తుంకో పిచ ప్రభుః ||

తా || ఆ దీపమునకు ఆవునెయ్యి ఉత్తమము, మంచి నూనె మధ్యమము, ఇప్పనూనె అధమము, ఇతరములైన అడవియందు పుట్టినట్టి నూనెలు అధమాధమములు. ఆవునేయితో దీపము వెలిగించి దానము చేసినటులైతే జ్ఞానలాభమున్ను, మోక్షప్రాప్తియున్ను కలుగును. మంచినూనె తో వెలిగించిన సంపత్తు, కీర్తి లభ్యమగును. విప్పనూనె తో దీపము పెట్టిన యిహభోగములననుభవించును. ఇతరములైన వన్య తైలములు కామ్యార్థములు. ఆవాలనూనెతోగాని, ఆవిశెనూనెతో గాని, దీపము పెట్టిన శత్రువులు నశింతురు. ఆముదముచే దీపముంచిన సంపత్తు, ఆయువు క్షీణమగును. గేదెనెయ్యితో దీపము వెలిగించినట్లయితే పూర్వము చేసిన పుణ్యము కూడా నశించిపోవును. అదే స్వల్పముగా ఆవునేతితో కలిపి పెట్టినట్లయితే యేమియు దోషములేదు. ఈ దీపదాన మహత్మ్యమెవరికినీ చెప్పనలవికాదు.








శ్లో| ఏకవర్తిం చ యోద్దీపం దద్యా ద్విష్ణుపరాయణః

సర్వపాప వినిర్ముక్త స్సతేజో  బుద్ధిమాన్ భవేత్

చతుర్వర్తి కృతై ర్దీపై ర్భూప తిత్వం ప్రజాయతే

దశవర్తి ప్రదానేన చక్రవర్తీ ప్రజాయతే

పంచాశద్వర్తి దీపేన దేవత్వం ప్రజాయతే

శతసంఖ్య ప్రమాణేన విష్ణు సాయుజ్య మాప్నుయాత్

సహస్ర వర్తి దీపేన విష్ణు రూపోభవేన్నరః

ఏతత్ఫలం  హరిక్షేత్రే ద్విగుణీం తులసీ వనే

త్రిగుణం జాహ్నవీ తీరే కార్తీక్యాం తు చతుర్గుణం

క్షీరాబ్ది శాయినః పూజాం యః కుర్యా ద్ద్వాదశీ  దినే

బృందావన సమీపేచ లభ్యతే పరమాం గతిం ||

తా || ఒక వత్తితో  దీపము పెట్టి దానము చేసిన, సమస్త పాపములచేత విడువబడినవాడై తేజస్విగాను, బుద్ధిమంతుడుగాను అగును. నాలుగు వత్తులతో దీపములను పెట్టిన రాజగును, పది వత్తులతో దీపదానము చేసిన చక్రవర్తి యగును.  ఏబది వత్తులతో దీపము వెలిగించిన దేవతలలో నొకడగును. నూరు వత్తులతో దీపదానము చేసిన విష్ణురూపుడగును. ఈ ఫలము విష్ణుక్షేత్రమందు, తులసీ సన్నిధియందు చేసినటులైన ద్విగుణముగాను, గంగాతీరమందు చేసిన మూడింతలును, అదే కార్తీకద్వాదశియందైన చతుర్గుణముగాను యగును. కార్తీక శుద్ధ ద్వాదశి రోజున బృందావన సన్నిధియందు మహావిష్ణువును పూజించిన వారికి పరమోత్కృష్టమైన గతి గలుగును.

శ్లో| బృందావనే వేదికాయాం ప్రతిమాం పుష్పమాలికాం

ఫలాది దీపమాలాంచ మండపంచా ప్యలంకృ తం

యో దృష్ట్వా నంద మాప్నోతి సర్వ పాపైః  ప్రముచ్యతే





ఏవం యః కురుతే భక్త్యా విష్ణుసాయుజ్య మాప్నుయాత్

ఇదం పవిత్రం పాపఘ్నం కార్తీక్యే ర్ద్వాదశీ దినే

బృందావనే స్సమాసీనో య శ్శృణోతి పఠేన్నరః

ఆయురారోగ్య మైశ్వర్యం ఆప్ను యాత్పరమం పదం ||

తా || బృందావన సన్నిధానమందు వేదిక మీద ప్రతిమ, పుష్ప మాలిక, ఫలాదులు, దీపములు, మండపములు వీటిని యెవరు చూచి ఆనందమందుదరో వారి పాపములన్నియు నశించును. ఈ ప్రకారం సాష్టాంగముగ శ్రద్ధాభక్తులతో సెవరాచారింతురో వారు విష్ణుసాయుజ్యమును పొందుదురు. పరిశుద్ధమైనటువంటిదిన్నీ, సమస్త పాపములు హరించునదిన్నీ, అయిన యీ మహత్మ్యమును కార్తీక శుద్ధ ద్వాదశీ రోజున బృందావ సమీపమున శ్రద్ధతో వినువారును, చదువువారును ఆయురారోగ్యయైశ్వర్యములను పొంది అంత్యమున పరమపదము నందుదురు.

ఇతి శ్రీవైష్ణవే విష్ణుధరోత్తరే

క్షీరాబ్ధిశయన వ్రతకల్పోక్తం నామ సప్తదశోధ్యాయ స్సమాప్తః

ఇట్లు క్షీరాబ్ధిశయన వ్రతకల్ప మహాత్మ్యమున

కల్ప కథా తాత్పర్యములు సమాప్తము